

ఏలూరు పురపాలక సంఘ రత్న జయంత్యుత్సవ సందర్భంలో పురపాలక సంఘ కార్యాలయావరణంలో స్థానిక పరిపాలనా శాఖమంత్రి శ్రీ ఎస్. శంకర రెడ్డిగారు గాంధీజీ కంచు విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. డా॥ మూల్పూరు రంగయ్యగారు జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. పటంలో పురపాలక సంఘాధ్యక్ష ఉపాధ్యక్షులు శ్రీ శీర్ల బ్రహ్మయ్య, డా॥ దుగ్గిరాల రాజశేఖరరావుగార్లు, గ్రామాభివృద్ధిశాఖా మంత్రి శ్రీ బి. ప్రభాకర పట్టాభిరామారావుగార్లు గలరు.

# ఏలూరు పురపాలక సంఘ రత్నోత్సవం

## పౌరుల విధులు, సంఘాల బాధ్యతల గురించి శంకరరెడ్డి, పట్టాభి రామారావుగార్ల ప్రసంగాలు

(స్వకీయ విలేఖరి)

ఏలూరు, సెప్టెంబరు 14 : 1866 లో ప్రభవించిన ఏలూరు పురపాలక సంఘం నేడు రత్నోత్సవం చేసికొన్నది. సంఘ కార్యాలయ ఆవరణలో ప్రత్యేకంగా నిర్మించి, సముచితంగా అలంకరించిన పందిరిలో ఉత్సవం స్థానిక స్వపరిపాలన మంత్రి నాయకంటి శంకర రెడ్డిగారి అధ్యక్షతను జరిగింది. గ్రామోద్ధరణ శాఖ మంత్రి శ్రీ బలుసు ప్రభాకర పట్టాభి రామారావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. డాక్టర్ మూల్పూరి రంగయ్య గారు జాతీయ పతాక నెగురవేశారు. అధ్యక్షుడు గాంధిజీ కంచు విగ్రహాన్ని ఆవిష్కరించారు.

ఆస్థాన ఆంధ్రకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, అయ్యదేవర కాళేశ్వర రావు, కాకాని వెంకటరత్నం, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, మోటూరి సత్యనారాయణ, అల్లూరి బాపినీడు, మాగంటి సీతారామదాసు, జిల్లా కలెక్టరు జె. పి. ఎల్. గ్విన్, జడ్జి కె. బి. కృష్ణారావు, స్థానిక సంస్థల ప్రాంతీయ ఇన్‌స్పెక్టరు కె. వెంకటాద్రి గార్లు ఉత్సవంలో పాల్గొన్నారు.

తొలుత రంగయ్యగారు పు. పా. సంఘ భవన ప్రాంగణంలో జాతీయ పతాక నెగురవేస్తూ ఈ పతాకం దేశంలో యావన్మందికీ చెందిందనీ, అయినా దీనిని గౌరవింపని విద్రోహ శక్తులుకూడా లేకపోలేదనీ వాటిని ఒక కంట కనిపెట్టి వుండాలనీ అన్నారు. శంకర రెడ్డిగారు గాంధిజీ విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ భారతీయులు తమ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోవాలంటే జాతిపిత చూపిన మార్గాన్నే అనుసరించాలని ఉద్బోధించారు.

తర్వాత పురపాలక సంఘాధ్యక్షుడు శీర్ల బ్రహ్మయ్యగారు శంకర రెడ్డి, పట్టాభి రామారావు, కృష్ణమూర్తి శాస్త్రి, మోటూరి సత్యనారాయణ గార్లకు పూలమాలలు వేసి, వారికీ, ఇతరులకు స్వాగతం చెప్పారు. ఈ సందర్భంలో ప్రచురించిన ప్రత్యేక సంచిక నుంచి పురపాలక సంఘ చరిత్ర, జరిగిన అభివృద్ధి, ప్రస్తుత సంఘపాలనలో జరిగిన కృషి మొదలైన విషయాలు చదివి వినిపించారు. 20 వేల జనాభా, రూ. 9/- వేల ఆదాయంతో రూ. 6/-ల అద్దె ఇంట్లో ఆవిర్భవించిన ఈ సంఘం నేడు 87 వేల జనాభా 10½ లక్షల ఆదాయం కలిగివున్నదన్నారు. ప్రస్తుత పాలక సంఘం అధికారంలో వున్న రెండేండ్లలో రోడ్లకు రూ. 5,70,497/-, నీటివసతి మురుగు కాల్వలకు రూ. 4,42,168/-, ప్రజారోగ్యానికి రూ. 9,94,182/-, ప్రాథమిక విద్యకు రూ. 4,34,179/-, సెకండరీ విద్యకు రూ. 6,80,008/-లు ఖర్చు చేసిందన్నారు.

### ప్రారంభోపన్యాసం

తర్వాత పట్టాభిరామా రావుగారు ఉత్సవాలను ప్రారంభిస్తూ, రత్నోత్సవం జరుపుకొంటున్నందుకు పు. పా. సంఘాన్ని అభినందించారు. పురపాలక సంఘాలు చేసేసేవ పౌరులందరికీ, పన్నులు చెల్లించే వారికీ, చెల్లించని వారికీ కూడా, సమంగా అందుతుంది. అందుచేత అవి చేసే సదుపాయాలను పౌరులు సక్రమంగా వినియోగించుకోవాలి. వాటిని వృథా చేసుకోరాదు. ఇందుకు పౌరులందరి సహకారం అవసరం. పౌరుల నుంచి ఈసహకారం పొందడానికి రెండు మార్గాలున్నవి.

ను ఏర్పాటు చేసుకోవడం. ఈరెండు, మార్గాలద్వారా పౌరులకు బాధ్యతలు వారికి గల వసతులు, ఉన్న స్థితి గతులు తెలిపి వారిలో చైతన్యం కలిగించాలి. సహకారంతో స్థానిక అవసరాలు తీర్చాలి. ఇందుకు సంఘ సేవకులు, పు. పా. సంఘ సభ్యులు ఎక్కువ తోడ్పడగలరు. సభ్యులు పు. పా. సంఘానికి గల ఆదాయ మెంత, ప్రజల సౌకర్యం దృష్ట్యా ఎప్పుడు ఏ పని ముఖ్యం అన్నది గమనించి, క్రమబద్ధంగా పట్టణాభివృద్ధికికృషి చేయాలి. ఇప్పుడు ప్రభుత్వం కూడా మన చేతులలో నే వున్నది కనుక పు. పా. సంఘాలు తమ విధులు మాత్రమే తాము నెరవేరుస్తు, తమకు సంబంధంలేని విషయాల జోలికిపోకుండా వుండడం మంచిది. ఈరెండు వ్యవస్థలూ ప్రజాక్షేమంకోసం కృషి చేసేవే కాబట్టి విభేదాలు అనవసరం. పురపాలక సంఘ పరిపాలనా, ఉద్యోగులూ ప్రజలగౌరవాన్ని పొందాలి. ఉద్యోగులు సేవాభావంతో ఆసక్తితో పని చేయాలి. ప్రజలు మంచి ఉద్యోగులు కావాలని కోరేటట్లయితే ముందు తాము వారికి సరైన గౌరవం ఇవ్వడం నేర్చుకోవాలి. అప్పుడే సమర్థులు, యోగ్యులు అయిన వారు ఈఉద్యోగాలకు వస్తారు. పు. పా. సంఘపాలన సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో జరగాలి అని మంత్రిగారు అన్నారు.

### అధ్యక్షోపన్యాసం

పిన్నమట శంకరరెడ్డిగారు అధ్యక్షోపన్యాసం చేస్తూ ఈపురపాలక సంఘం రత్నోత్సవం చేసికొంటున్నందుకు సంతోషం కలిగిందన్నారు. ఈరాష్ట్రములో స్త్రీని అధ్యక్షురాలుగా ఎన్నుకొన్న ప్రత్యేకత ఈసంఘానికే దక్కిందనీ, అదేకాక ప్రస్తుత ఎన్నికలలో లోగడ చైర్మనులుగా వున్నవారు ముగ్గురు పోటీలేకుండా ఎన్నిక కావడం ముదావహమైన విశేషమనీ అన్నారు. పు. పా. సంఘ పరిపాలన జయప్రదం కావాలంటే ప్రతిపౌరుడూ తనవిధులను సక్రమంగా నిర్వహించాలి. పు. పా. సంఘాలు పల్లెల నుంచి బస్తీలకు చేరే బీదలకు నివేశన స్థలాలు ఏర్పాటుచేసి వుచితంగా ఇవ్వాలి. లేకపోతే వాళ్ళు ఎక్కడ పడితే అక్కడ పాకలు వేసుకొని పట్టణాలన్నింటినీ మురికికూపాలు చేస్తారు. చాలాపట్టణాలలో మంచినీటి వసతులులేవు. ఏటని ఏర్పాటు చేసేందుకు పంచవర్ష ప్రణాళిక ఒకటి తయారు అయిందికాని, ధనాభావం వల్ల దానిని అమలు చేయడానికి ఉపక్రమింపలేకపోయాము. అని శంకరరెడ్డి గారు అన్నారు. అనంతరం దుగ్గిరాల రాజశేఖరరావుగారి వందనాలతో ఆ పూట కార్యక్రమం ముగిసింది.

### పౌరసన్మానాలు

సాయంత్రం సభలో ఆస్థానకవి, మంత్రులు మోటూరి సత్యనారాయణ గార్లకు పౌరసన్మానాలు జరిగాయి. శీర్ల బ్రహ్మయ్యగారు పత్రాలు చదివి సమర్పించారు. ఈసందర్భంలో ఈదర వెంకటావుగారు పౌరులతరఫున కృష్ణమూర్తి శాస్త్రిగారికి రూ. 1126/-లు చదివించారు. పు. పా. సంఘంవారు శాలువసమర్పించారు. పిన్నమట కౌన్సిలు హాలులో శంకరరెడ్డిగారు ఆదినుంచి ఇప్పటివరకూ ఈ పురపాలక సంఘానికి అధ్యక్షత వహించినవారి పేరులు గల ఫలకాన్ని, పట్టాభి రామారావు గారు ఉపాధ్యక్షుల పేరులుగల ఫలకాన్ని ఆవిష్కరించారు. తర్వాత అయ్యదేవర కాళేశ్వరరావు, చదలవాడ చక్రధరరావు, మూల్పూరు రంగయ్య, మోటూరి సత్యనారాయణగార్ల వరుసగా కీ. శే. మోచర్ల రామచంద్రరావు, కీ. శే. ములుకుట్ల సూర్యప్రకాశరావు, కీ. శే. హి. వ. జోగయ్యశర్మ, శీర్ల బ్రహ్మయ్యగార్ల చిత్రపటాలను ఆవిష్కరించారు. ఈ చిత్రపటాలలోనివారంతా ఈ పు.పా. సంఘానికి అధ్యక్షులుగా వుండినవారే. వీటితో అధ్యక్షులందరి ఛాయాపటాలు హాలులో ఏర్పడినవని బ్రహ్మయ్య గారు తెలిపారు.

ఆసిమ్మట రామచంద్రరావు పేట లోని పార్కులో ఉత్సవసందర్భంగా బాలబాలికలకు ఏర్పాటుచేసిన క్రీడాసౌకర్యాలకు కలెక్టరు గ్విన్ గారు ప్రారంభోత్సవం జరిపారు. బాలబాలికలకు మిఠాయి పంచి పెట్టారు.

రాత్రి రహిమాన్ సోదరీమణులు భరతనాట్యం, హిందీ ప్రేమామండలి 'షాజహాన్' హిందీనాటకం ప్రదర్శించారు.

# భారతదేశ భద్రత పాశ్చాత్య రాజ్యాలపై ఆధారపడింది

## లూయీ ఫిషర్ ప్రసంగం

మద్రాసు, సెప్టెంబరు 16 : "చైనా ప్రభుత్వం ఇంతవరకు భారత ప్రభుత్వానికి అనేక స్నేహవ్యతిరేక చర్యలు చేసిందిగాని ఒక్క స్నేహపూర్వక చర్య చేసినట్లు మచ్చుకైనా చూపెను. చైనా, టిబెట్టును ఆక్రమించి తన సైన్య సమ్మోహాలను భారతసరిహద్దులకు తెచ్చిపెట్టినది. ఇండోచైనానుగూడా ఆక్రమిస్తే తూర్పుసరిహద్దున గూడా వచ్చి కూర్చుంటుంది. చైనా చేసిన పనులవల్ల భారతసైన్య నివాసస్థావరాలను మార్చవలసివచ్చినది. ఆత్మరక్షణకు భారతదేశం స్వసైన్యంమీద ప్రధానంగా ఆధారపడవలసివున్నా, భారత సైన్యబలం, బలహీనమూ, స్వల్పమూ అయినందువల్ల పాశ్చాత్య రాజ్యాల బలంపై భారతదేశ భద్రత ఆధారపడి వున్నది" అని అమెరికా ఖ్యాతిప్రఖ్యాత పత్రికారచయిత లూయీఫిషర్ నిన్న సాయంత్రం "ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డు అఫెయిర్సు" ఆధ్వర్యాన సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటి భవనంలో మాట్లాడుతూ చెప్పారు.

ఫిషర్ తమ ప్రసంగంలో ఇల్లా చెప్పారు:–చైనాకు టిబెట్ పై సర్వతంత్రఅధికారం ఉన్నది. దాన్ని ఎవరూ కాదనరు. టిబెట్టు దేశాన్ని విదేశం వారు కావాలని కోరడం లేదు. అది ఎవరికి ప్రయోజనకరం గనుక ? మరి ఎందుకు చైనా టిబెట్టును ఆక్రమించింది ? ఇంగ్లాండుగాని, ఫ్రాన్సుగాని, అమెరికాగాని టిబెట్టుకు పోలేవు గదా ? ఇది ఇంతటితో ఆగే వ్యవహారం గాదు. ఇపుడు చైనాసైన్యాలు భారతదేశ సరిహద్దు నేపాల్ సరిహద్దుల విడిసివున్నాయి. అందువల్ల భారతదేశ సైన్య నివహాల స్థావరాలు ఉత్తర హిందూస్థాన్‌లో మార్చవలసివచ్చింది; అంతేగాదు, నేపాల్ కమ్యూనిస్టు నాయకుడు డా॥ కె. ఐ. సింగు టిబెట్ ప్రభుత్వ అతిథిగా ఉండెననీ, తరవాత పెకింగ్ వెళ్ళినాడనీ మనం పత్రికల్లో చదివాము. ఇది పండిత నెహ్రూకు చైనాప్రభుత్వ మైత్రియుతచర్య అనగలమా ? చైనా మచ్చుకైనా ఒక్క స్నేహపూర్వక చర్యనైనా చేసిందని చెప్పగలరా అని ఢిల్లీలో నిఉన్న వ్యక్తులను అడిగాను. ఆలోచించి వారు 'లేదు' అన్నారు. అయితే వారికి నాకు గూడా చైనా చేసిన అమిత్ర చర్యలు అనేకం కండ్లకు కడుతున్నాయి. అయితే కలతచెందడానికి కాలం యింకా రాలేదు. అందువల్ల ప్రపంచ రాజకీయాల్లో భారతదేశ స్థితిగతులను జాగ్రత్తగా ప్రశాంతంగా ఆలోచించి వ్యవహరించవలసివున్నది.

"భారతదేశమూ పాశ్చాత్య రాజ్యాలుగూడా సైనికంగా ఆత్మరక్షణకు ఆయత్తం కాకతప్పదు. సైనికమైనదేమైనా గాంధీజీకి గాని నెహ్రూకు గాని గిట్టదని నేనెరుంగుదును. అయితే హైద్రాబాదు, కాశ్మీరుజునాఘడ్ లలో సైన్యం తో పని చేయకుండా భారతదేశంవ్యవహరించ లేకపోయింది. అందువల్ల సైన్యబలం కొంతవరకు శాంతి నిమిత్తం అవసరం. పాశ్చాత్య రాజ్యాల ఆర్థిక సహాయం, సైనిక బలం లేకపోతే రష్యా తన అసత్యాలతో ఐరోపాలోగాని ఆసియాలోని ఏదేశాన్ని గాని ఇండియా సహితంగా జయించడానికి ఎంతమాత్రమూ సంకోచించేదన్నమాట కల్ల. అందువల్ల భారతదేశ భద్రత ప్రధానంగా తన ప్రజాస్వామ్యములోవుంది. సైన్యంలో వున్నవి. అయితే ఆ సైన్యం బలహీనమూ స్వల్పము. అందువల్ల పాశ్చాత్యరాజ్యాలపై ఉన్నది. ప్రపంచశాంతి కావాలంటే రష్యా తన పాత నిరంకుశ పద్ధతులు మార్చుకోవలసి ఉన్నది.

కౌన్సిలు అధ్యక్షులు పి. రాఘవన్ గారు స్వాగతమిచ్చారు. కార్యదర్శి ఎస్. ఆర్. వెంకటరామన్‌గారు అభినందనలు చెప్పారు.

## జిల్లా ఆస్పత్రులలో దేశీయ వైద్య పట్టభద్రులకు అవకాశం

### ప్రభుత్వం పరిశీలిస్తున్నదని ఆరోగ్యశాఖామంత్రి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 16: "దేశీయ వైద్యకళాశాల వైద్యపట్టముల పొందినవారికి జిల్లా కేంద్ర అనుపత్రులలో హౌస్ సర్జన్లుగా వ్యవహరించేందుకు ఉండే అవకాశాలను త్వరలో ప్రభుత్వంవారు పరిశీలించగలరు. పూర్వకాంగ్రెసు ప్రభుత్వంవారు నియమించిన విచారణ సంఘంవారి సిఫార్సులను అమలుచేయడానికి యత్నం జరుగుతోంది. కాని ద్రవ్యాభావము, ప్రభుత్వ యంత్రానికి సహజమైపోయిన జాప్యము వల్ల అలస్యం జరుగుతోంది" అని మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి ఎ. బి. షెట్టిగారు నిన్న సాయంత్రం చేతుపట్టులో దేశీయవైద్యకళాశాల విద్యార్థి సంఘ ప్రారంభోపన్యాసంచేస్తూ చెప్పారు.

శ్రీమతి అహల్యాసంతానం సభాధ్యక్షత వహించారు.

విద్యార్థి సంఘ అధ్యక్షులు డి. వి. అప్పలాచార్లు సభాసదులకు స్వాగతమిస్తూ ఈ కళాశాల వైద్యవిద్యార్థులను ఇతర వైద్యవిద్యార్థులతో సమానంగా చూడాలని అర్థించారు. కుమారి ఆర్. సుభద్ర మంత్రిగారికి సంఘంపక్షాన సన్మానపత్రాన్ని సమర్పించింది.

ఆరోగ్యశాఖామంత్రి ఎ. బి. షెట్టిగారు ప్రారంభోపన్యాసంలో ఇల్లా చెప్పారు: "నేను శ్రోతల్లో నీవు ఏ ఇతర కళాశాలవిద్యార్థులకూ తీసిపోను. అయితే ఈ సంస్థలో వ్యవహారము అంతా సక్రమంగా ఉన్నదని అనలేను. మీ విద్యావిధానము, శిక్షణ పూర్తిగా మార్పు పొందవలసి ఉన్నది. కొత్త విధానంవల్ల ముందుకు మంచి ప్రయోజనకరమైన వైద్యులనుతయారు చేయవలసి ఉన్నది. ... కాని కళాశాలలోని సాధన సంపత్తి, ఇంకా ...

న్యాసాలు పెట్టే పాఠాలు అయిపోయాయంటే అయిపోయాయని చెప్పడం వైద్యవిద్య లక్షణం గాదు. అభ్యాసవలన, విద్యార్థులకు సన్నిహితసంబంధం ఉండాలి. విద్యార్థుల సంఖ్యకు తగిన అధ్యాపకులు లేనందున పాఠశాల బోధన ప్రమాణం తగ్గుచున్నది. వైద్య బోధన శాస్త్రము కాలానుగుణ్యముగా మారుతున్నది. ప్రస్తుతం విద్యార్థులకు అనుభవం కన్న శాస్త్రబోధ ఎక్కువ అవుతున్నది. విద్యార్థులకు ఇప్పటి కన్న హెచ్చు అనుభవం చేకూర్చాలి. దేశీయవైద్యంలోని ఉత్తమ సుణాలను ప్రభుత్వం గమనించినది. మీకు ఇక్కడ ఉన్న అవకాశాలను మీరు సద్వినియోగం చేసుకోవాలి. మీ కళాశాలకు తగు సౌకర్యములుచేయు ప్రభుత్వం సానుభూతితో ఆలోచింపగలదు.

శ్రీమతి అహల్యాసంతానం సేవలకు ఉపయోగపడే అందుబాటులో ఉండే మందులు వైద్యులు కనిపెట్టాలన్నారు.

# మునిసిపల్ ఎన్నికలు

## కాంగ్రెస్‌తో లీగు ఒప్పందం

మదరాసు, సెప్టెంబరు 16 : మునిసిపల్ ఎన్నికలలో పోటీచేసే విషయమై ముస్లింలీగు కాంగ్రెసు ఒకవిధమైన ఒప్పందానికి వచ్చియున్నారు. ఈ ఒప్పందంప్రకారం మునిసిపాలిటీలోగల మొత్తం ముస్లిం జనాభా ప్రకారం లీగుకు కొన్ని స్థానాలను దామాషాగా ప్రత్యేకించాలని కాంగ్రెసు అస్థానాలకు అభ్యర్థులను నిలపెట్టరాదని మిగతా స్థానాలలో లీగువారు కాంగ్రెసు వారికే బలపరచ వలసిందని ఏర్పాటు చేసుకొని యున్నారని తెలుపబడుచున్నది.

ముస్లింలీగు నాయకుడు మహమ్మద్ ఇస్మాయిల్ గారు యీవిషయమై ఒక ప్రకటన చేస్తూ యీ ఒప్పందం జరగకముందే కొన్ని స్థలాల్లో నామినేషన్ల కాలం గడిచిపోయినందున తలచినన్ని స్థానాలు ముస్లిములకు లభ్యంకాలేదని యీ ఒప్పందం రాబోయే కాలంలో కూడా అనుసరింపబడును. గావున ముస్లిములు దానిని గౌరవించి ఎన్నికల రోజులలో ఆచరణలో పెట్టేందుకు తలపెట్టాలని విజ్ఞప్తి చేశారు.

## కార్పొరేషను ఎన్నికలు

### రేపటి రోజున 13 డివిజన్లలో పోలింగు

మదరాసు, సెప్టెంబరు 16 : మదరాసు నగరముని కార్పొరేషను సభకు రేపటి రోజున సెప్టెంబరు 17 వ తేదీన 13 డివిజన్లలో పోలింగు జరుగుతుంది. ఈ డివిజన్లలోగల మొత్తం 3¾ లక్షల జనాభాలో దాదాపు 1¾ లక్ష ఓటర్లు యున్నారు. రేపు ఎన్నిక జరిగే డివిజన్లలో ఒక 14 వ డివిజనునందు జనరల్ స్థానం గాకుండా స్త్రీల ప్రత్యేక స్థానంకూడా యున్నది. 13 డివిజన్లలో మొత్తం 14 అభ్యర్థులను ఓటర్లు ఎన్నికోవలసి ఉంది.

ఇతర డివిజన్లలో ఎన్నికలు సెప్టెంబరు 19, 23, 28 తేదీలలో జరుగగలవు. ఓట్ల లెక్కింపు సెప్టెంబరు 24, మరి 30 తేదీలలో జరుగుతుంది.

### విచిత్ర కవలపిల్లల మృతి

మదరాసు, సెప్టెంబరు 16 : నిన్న జనరలు ఆసుపత్రిలో కడుపులు ఒక్కటిగా కలిసియున్న విచిత్ర కవల పిల్లలు వైద్యులు శస్త్ర చికిత్స చేసి విడదీసిన కొన్ని గంటలలో చనిపోయారు.

## గవర్నమెంటు ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు

### మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్

(జనరేషన్ సర్కిల్)

బేసిన్‌బ్రిడ్జి పవర్ స్టేషన్‌వద్ద ఒక ఆయిల్‌హౌస్ కట్టుటకు సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి. సదరు టెండర్లపై, "Basin Bridge Power Station-Construction of an Oil House", అని వ్రాసి, టెండరు పేరు కూడా వ్రాసి, సూపరింటెండింగ్ ఇంజనీరు(జనరేషన్)మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్ వారి ఆఫీసులో మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్ పవర్ స్టేషన్, బేసిన్ బ్రిడ్జి, మద్రాసు 12 వద్ద తే 3-10-52 మధ్యాహ్నం 3 గంటల వరకు సూపరింటెండింగ్ ఇంజనీరు వారివద్ద దాఖలు చేసికొనవలెను.

టెండర్లు డిపార్టుమెంటు వారిచే నియమించిన షెడ్యూలులో నుండవలెను. ఈ ఫారములు దరఖాస్తుచేసి సూపరింటెండింగు ఇంజనీరు (జనరేషన్) మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్, పవర్ స్టేషన్ బేసిన్ బ్రిడ్జి, మద్రాసు 12 వారి ఆఫీసులో ఉదయం 11 గం.ల మొదలు సాయంత్రం 3 గం.ల వరకు ... సెట్టు 1-కి నిర్ణయించిన ఫీజు రు. 5/- సేల్సు టాక్సుతో కూడా చెల్లించి పొందవచ్చును. ఒక్కొక్క టెండరు సెట్టు డ్రాయింగ్సు, స్పెసిఫికేషనులతో పూర్తిగా నుండును.

సెట్టు 1-కి రు. 1/-న్ను సేల్సుటాక్సున్ను చెల్లించి సరిమానములు ... ... టెండరు నోటీసు పొందవచ్చును.

కోరణములు చూపకనే ఏ టెండరును గాని అన్ని టెండర్లను గాని రాని కరించు హక్కు సూపరింటెండింగు ఇంజనీరు (జనరేషన్), మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్ వారికి గలదు.

వి. ఆర్. యస్. రావు,
సూపరింటెండింగ్ ఇంజనీరు,
(జనరేషన్)
మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిష్టమ్,
లు.ం. ఇ. యస్. పవర్ స్టేషన్,
బేసిన్‌బ్రిడ్జి, మద్రాసు-12.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.